REG No. M. 2185

REG. No. N° 45

The First Telgu Bi-weekly in Andhra Desa, The only Telugu News Paper for
H E H The Nizam's Dominions, (Hyderabad Dn)

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును.

హైదరాబాదు—దక్కను

1-3116

**GOLKONDA PATRIKA.**

సంపుటము ౫ | ప్రమోదూతనామ సంవత్సర జ్యేష్ఠ బ॥ ౭ బుధవారము **18—6—30** | సంచిక ౧౨

# గృహ వైద్యము

డాక్టర్ ఫ॰ ఆర్థర్‌గారు

౧

రక్తమును శుభ్రపరచుటకు సూడ పొం[ట]లేక సుగంధిపాల్యయును నీళ్లను శుభ్రపరచుటకు చిల్లగింజలును, నేత్రమాలిన్యమును పోగొట్టుటకు పటిక నీళ్లును, జిహ్వాదోషమును బోగొట్టుటకు మా ఫలకాయముష్ట గృహమిత్రములు.

౨

కుక్క మూత్రి బాధనుండి తొలగించుటకు నేలవేముగింజల కషాయమును గ్రహణిబాధనుండి విముక్తి జేయుటకు కరక పువ్వుయును: ముక్కు నుండి రక్తము గారు వారికి దానిమ్మ పువ్వురసము, లేక పటిక పొడియైనను కండిటీను నోట్లో పట్టిన యెడల నీరుకోడి పుక్కిలించుటయును గృహమిత్రములు.

౩

పాలు త్రాగని పాపలకు సోపుగింజలు నీళ్లును (Dill water) జీర్ణము గాని ధాతలకు సొంఠి, తిరి పిప్పళ్లు మిశ్రి కల్పిన మార్గమును, ఎంతమంది ఇలిపిల్లలో వింద వారగించినను, కొంచెమైనను జీర్ణశక్తికి గొరత కాని „ఆర్వే నోలును” „Arve nol” మలబద్ధముతో బాధింపబడు వారికి ఆలతెగసె, గులాబి మొగ్గలు, మిశ్రి, కల్పిన మార్గము యొక్క సేవన గృహమిత్రములు!

౪

ఎన్నటికి ఇవలని తామరకు గంగరావి కాయలు పాలు తీసి రుద్దుటయును, దంత స్రావముగలవారు మఱిపాలు తో దంతములను రుద్ది, మఱ్ఱి ఊడలతో తోముటయును; దగ్గితే రక్తము పడిన వారలకు ఎఱ్ఱ అరటిపండులో చందిని అత్తుగాని, పచ్చ కర్పూరము పెట్టి సేవించుటయు; పగిలి రక్తము గాను కాలి మడిమలకు కొబ్బరిపిండి కడుగుతో అరగ దీసిన గంధమును గృహమిత్రములు!

౫

మూత్రము సరిగారాక మూత్రము విసర్జించునపుడు రక్త మిశ్రితములో మూత్రము వెడలిన వారికి కొనుగు వేరు పై వేరడు, పంచదార మిశ్రి కల్పి పానము జేయుటయును, రక్త ప్రదరముతో బాధింపబడు వారికి అరటి పువ్వు కావి రాయి మన్ను, రేగు ఆకు పుట్టయును, తేజా కూష్మాండ లేహ్యమును రక్త అరికకణములతో బాధింపబడు వారికి ముల్లంగి మిశ్రియును లేక దురద కంద కూరయైనను, రక్త వాంతి వారికి వరి పేలాలు, పేలాది గుటిక లేక మూర్ఛ, బలకర్ర వెపగుయును, గృహమిత్రములు!

౬

విడువని జ్వరముకు విష్ణు క్రాంతియును; మానని కడుపులోని వ్రణమునకు మహిసాక్షి సుగ్గులుయును, పగులని గడ్డకు పుల్ల పావిలి కూరయును: విరిగిన ఎముకకు జొల్లి బూసాకు యును, గృహమిత్రములు!

౭

పసుపెనిమిది పాలకు శొంఠి, వెలిగారము, పెంధలవణము, ఇంగువ, కొరుముసగ రసము, తో నూరిన మాత్రలును పసుపెనిమిది ఎలుకవిష బాలకు పెడి ప్రత్తియాకు రసము దిగుమట్టు నూనెయును, పలువిధములైన మొట్టుపట్లకు తురక వేపాకురసము, వెలగచెక్క రసమును, పసుపాలును సన్నిపాత భాగములకు పర్పాటకము గృహమిత్రములు!

౮

అపసరము, గర్భాశయ అండవృద్ధి బాధను తొలగించుటకును. అంగములోని రాళ్లను తీయుటకు కొండపిండివేళ్లు మిశ్రి కల్పి పానము జేయుటయును, గర్భములోని గడ్డలను శోధించుటకు గారచెక్క పెరుగుయును, అల్లము, సున్నము కలిపి కణతులను మనుమాడుటయందును గృహమిత్రములు!

౯

చను కుడుచు వెలిగారము తేనె యును, పాలు రక్తము మిశ్రమయి ఆవస్థపడు వారికి ఆముదపు ఆకులతో కాపడమును, పాలును పోగొట్టవలెనంటే తమలపాకులు, మల్లెలును, చంకగడ్డలకు సాంబ్రాణి, ఆరతి కర్పూరము, మునగచెక్క రసమును గృహ మిత్రములు!

౧౦

ఉష్ణపు దగ్గులకు ఏకులి రసము చక్కెరయును శ్లేష్మ దగ్గులకు మేకపాలు వెల్లుల్లి ఎంతయును, సాధారణ దగ్గులకు సన్నరాష్ట్రము తేనెయును, పిత్తక్షయులకు వెన్న, చక్కెర, తేనె, బంగారు వర్క కల్పి సేవించుటయును గృహమిత్రములు!

## రెడ్డి జనసంఘ విద్యార్థి వేతనములు

మదరాసు

బీదరెడ్డి విద్యార్థులకు (౧౯౩౦–౩౧) సంవత్సరమునకు విద్యార్థి వేతనములివ్వబడును. ఈ విషయమును యక్సి క్యూటు కమిటీవారు జూలై నెల ఆఖరున పరిష్కరించెదరు. కాన బీదరెడ్డి విద్యార్థు లందరును జూలై నెల ౧౦ వ తేదిలోగ తమ అప్లికేషన్ల పంపుకొన వలసినది. అప్లికేషను ఫారములు రెడ్డి జనసంఘ కార్యదర్శియగు కోటిరెడ్డిగారి వద్ద దొరకును.

ముఖ్యముగ గమనింప వలసిన విషయము

చిత్తూరుజిల్లా హైస్కూలులో చదువు ఆ బ్రాహ్మణ పిల్లలకును. కొందరు ఉన్నత పాఠశాల (High school) చదువు బాలికలకును దప్పమరి ఇతర ఉన్నత పాఠశాల బాలులకును, మాధ్యమిక పాఠశాల బాలులకు విద్యార్థి వేతనములు దొరకుట చాలదుర్లభము. కళాశాల విద్యార్థులకును, యంత్రవిద్య [Technical courses exceptlaw నేర్చుకొనువారికి మాత్రమేయివ్వబడు విద్యార్థి వేతనము లివ్వబడు చున్నవి. విద్యార్థి వేతనముల కావలయునన్నవారు వారి అప్లికేషను ఫారం వెంబడి వారు బీదవారైనట్లు సర్టిఫికెట్లను కూడ పంప వలయును. పూర్వము విద్యార్థి వేతనములను బడయువారు కూడ వారి విద్యార్థి వేతనముల తిరిగి అప్లికేషను ఫారముల బంపి జారీచేసికొన వలయును.

ఇట్లు

కే. కోటిరెడ్డి

బారిష్టర్ అట్ లా

యమ్. యల్. సి కడప

